E ANDHRA PATRIKA (WEEKLY EDITION) MADRAS.



# ఆంధ్రపత్రిక



318051

Regd. No. M, 5745 సంపుటం 38. సంచిక 152 FOUNDER DESODHARAKA K. NAGESWARA RAO. ఆదివారం 2-9-1951 వెల 2 అణాలు, హోల్ 0-2-4.

# ఆహారసమస్యపై ప్రభుత్వాన్ని ఎదుర్కొంటున్న గడ్డుపరిస్థితులు

## రహస్యంగా రవాణా అవుతున్న 7 లక్షల కరెన్సీనోట్లస్వాధీనం

బొంబాయి, ఆగస్టు 31: విదేశాలకు దొంగతనంగా కరెన్సీ నోట్లు రవాణా చేయడం ఈమధ్య చాలా తరుచు అయింది. బొంబాయి నుంచు అధికారులు ఈవేళ యిక్కడ శాంతాక్రజ్ విమానాశ్రయంవద్ద, ఇండియా, బ్రిటన్, అమెరికాల కరెన్సీ నోట్లు దాదాపు 7 లక్షల రూ. కిమ్మతు చేసేవి ఇలా దొంగతనంగా రవాణా చేయబడుతుండగా పట్టుకొన్నారు.

ఇప్పుడు సి.ని.స. ఆరాలనుబట్టి, యింకా కోట్లకొలది రూపాయల కరెన్సీనోట్లను త్వరలోనే పట్టుకోగలమని, అని పిస్తున్నదనీ, అనేకమంది ప్రముఖ వ్యక్తులకూ, సుప్రసిద్ధ కంపెనీలకూ, ఈ దొంగ వ్యాపారంతో సంబంధం ఉన్నట్లు ఆచూకీ తేలిందనీ, సుంకపు అధికారులు వెల్లడించారు.

మొదట్లో ఈదొంగ వ్యాపారస్తులు రేవులద్వారా తమ వ్యాపారం సాగించారు. కాని అధికారులు అక్కడ కట్టుదిట్టాలు ఎక్కువ చేయడంతో ఇప్పుడు విమానాశ్రయాల ద్వారా రవాణా చేయడం ఆరంభించారు.

కొద్ది రోజుల్లోనే చాలా ఆశ్చర్యకరమైన విషయాలు కొన్ని ప్రకటించబడగలవని ఒక పోలీసు అధికారి అన్నారు.

## ఆగ్నేయాసియా అధ్వాన్నపు ఆర్థిక పరిస్థితులు

### హఠాత్తుగా విషమ పరిణామంతప్పదని సమితికి దూరప్రాచ్య ఆర్థికసంఘ నివేదిక

యునైటెడ్ నేషన్స్, ఆగస్టు 31: ఆసియాలోనూ, దూరప్రాచ్యంలో ఆర్థిక స్థితి ఈమధ్య కొంత బాగుపడినట్లు కన్పించినా, మొత్తంమీద అధ్వాన్నంగానే వున్నదని ఈ రాజ్యాల ఆర్థికస్థితిగూర్చి సమితి ప్రకటించిన నివేదికలో వెల్లడి చేయబడింది.

కొరియా యుద్ధం మూలంగానూ, పునరాయుధ ధారణ కార్యకలాపాల వల్లను, ఎగుమతుల ధరలు హెచ్చి, దిగుమతుల ధరలు సరసంగా వుండి వున్నందువల్ల, వాణిజ్యంలో లాభం కనిపించి, పరిస్థితి ప్రస్తుతానికి బాగుగా వున్నట్లే కన్పిస్తున్నది అని ఈ నివేదికలో సమితి తాలూకు ఆసియా, దూరప్రాచ్య రాజ్యాల ఆర్థిక సంఘం కార్యదర్శి శ్రీ పి. లోకనాథన్ స్పష్టం చేశారు.

అదికాక 1950లో ఈ దేశాల సొంత ఆర్జన కూడా హెచ్చింది. ఈ హెచ్చిన దేశాలనుండు పేర్కొనదగినవి ఇండోనేషియా, మలయాలు. ఇవి రబ్బరు, తగరం మొదలైన పదార్థాలను సమృద్ధి చేస్తూవుంటాయి. చివర పేర్కొనదగినవి ఇండియా, బర్మాలు.

అయితే ఆయా ఎగుమతుల సమతౌల్యం ఇట్లానే చాల్లకాలం వుంటుందని అనుకోవడానికి వీలులేదని ఈ నివేదికలో ఒక హెచ్చరిక చేయబడింది. దీర్ఘకాలికంగా ఈ దేశాలు తమ ఆర్థిక వ్యవహారాలను నడిపించే పథకంలో కొలబద్దపడటం తప్పదు. యిప్పుడో ఒకప్పుడు హఠాత్తుగా ఈ స్థితి తారుమారై పోవుకుంటుంది. అదీకాక, ఈ రాజ్యాల ఆర్థిక ప్రామాణ్యం యుద్ధపూర్వం కన్నా కూడా ఇప్పుడు తక్కువగా వుంది. ఇంకొ తగ్గే సూచనలు కన్పిస్తున్నాయి. ఇక ఈ ధోరణి తొలగి, ద్రవ్యోల్బణస్థితి నిరోధింపబడాలంటే, సమరసమైన ఎగుమతి సుంకాలు, సమరసమైన దిగుమతి నిబంధనలు, సమరసమైన పన్నుల విధాన పద్ధతులు అమలుజరగాలని ఈ నివేదిక సూచిస్తున్నది.

### వియత్మిన్ దీవిపై ఫ్రెంచి పారాషూట్ దాడి

సైగాన్, ఆగస్టు 31: ఇండోచైనాలోని అన్నామ్ సముద్రతీరానికి సమీపంగా ఉన్న, హోలాహోకే ద్వీపంలో పారాషూట్ దళాలను విమానాలనుండి దింపినట్లు ఫ్రెంచి సైన్యం ఈరోజున ప్రకటించినది. ఆ సైనికులు పది చదరపు మైళ్ల వైశాల్యం కలిగిన ప్రాంతాన్ని ఆక్రమించుకున్నారు. అక్కడి 50 మంది వియత్మిన్ సైనికులు లొంగి పోయారనీ, 3000 మంది ప్రజలు ఫ్రెంచి సైన్యాలతో కలిశారని ఆ ప్రకటనలో ఉన్నది.

## “నెహ్రూ-టాండన్ దృక్పథాలూ విధానాలూ పరస్పర విరుద్ధాలు”

### ప్రధానమంత్రిని పదభ్రష్టుని చేయడానికి ప్రయత్నాలు జరుగుతున్నట్లు మష్రువాలా ప్రకటన

వార్ధా, ఆగస్టు 31: హరిజనపత్రికా సంపాదకులైన కే. జి. మష్రువాలా నెహ్రూ-టాండను వివాదమును గూర్చి తమ అభిప్రాయములను యీ క్రింది రీతిగా వెల్లడించిరి.

కేంద్ర పార్లమెంటులోని కాంగ్రెసుపార్టీ నాయకత్వమున్నూ కాంగ్రెసు మహాసభ అధ్యక్ష పదవియున్నూ ఒక్కరికే ఉండాలి. అయితే పార్లమెంటు వ్యవహారాలతో సంబంధము లేనటువంటి ఇతర కార్యకలాపమును నడిపించే నిమిత్తమై ఒకప్రత్యేక కార్యవర్గమున్ను దానికొక చెయిర్మనున్ను ఎన్నుకొనవలసియుంటుంది. ఈ కార్యవర్గము కాంగ్రెసు అధ్యక్షుడైన కేంద్ర పార్లమెంటరీ కాంగ్రెసుపార్టీ నాయకునిక్రింద పనిచేస్తూ ఉండాలి. కాంగ్రెసు ఆదర్శములను సిద్ధాంతములను అమలుపరచు నిమిత్తమై యీ కార్యవర్గములోని రాజకీయవేత్తలున్ను పరిపాలనా వ్యవహార నిర్వహణ దక్షులును కొంచెవ రక్షణ శ్రేణిగా ఏర్పడి పని చేస్తూ ఉండగలరు. నెహ్రూవర్గం ఒకటి ఉంది. టాండనువర్గం ఒకటి ఉంది. ఈ రెండవ వర్గం ముందంజవేయకుండా దేశాభ్యుదయ కార్యకలాపమును సాగించకుండా అసమర్థంగా ఉంది. ఈ విషయమును కాంగ్రెసు మహాసభవారు గ్రహించి, నెహ్రూకు పర్యాధికారం నిరాఘాటంగా యిచ్చి వేయాలి.

ఇటీవల మధ్యప్రదేశ్ హోంమంత్రి డి. పి. మిశ్రాగారు పండిట్ నెహ్రూ యొక్క వ్యవహార ధోరణిని నిరసిస్తూ ఒక ప్రకటనచేశారు. కాని ఆ ప్రకటనలో వారుచేసిన నిందారోపణ లన్నియు కాంగ్రెస్ మహాసభకే వర్తిస్తాయి. కాంగ్రెసు మహాసభ విషయములో పండిట్ నెహ్రూ మొట్ట పెట్టిన అంశముల నేమిశ్రా గారు తిరిగి వక్కాణించారు. పండిట్ నెహ్రూ చెప్పినవిషయమేమిటంటే, కాంగ్రెస్ మహాసభ వారిచే ఆమోదింపబడవలసిన తీర్మానము నెహ్రూ స్వయంగా రచించి తయారు చేసిన పిమ్మట అది కాంగ్రెసు మహాసభ వారిచే ఆమోదింప బడుతున్నట్లు నెహ్రూ సూచించిన వ్యవహార విధానము నే కాంగ్రెసుసభ ఆమోదిస్తోంది. కాని, యీ తీర్మానాలకు, యీ వ్యవహార విధానములకు యీ దృక్పథానికి పూర్తిగా వ్యతిరేకమైన దృక్పథంగల కాంగ్రెసు అధ్యక్షుణ్ని, కాంగ్రెసు కార్యవర్గ సభ్యులను ఎన్నుకొనడం జరుగుతోంది. ఇటువంటి కాంగ్రెసు వర్కింగ కమిటీయున్ను కాంగ్రెసు ప్రెసిడెంటున్నూ చేరి ప్రతి విషయంలోను పండిత నెహ్రూగారు అనుసరించే ధోరణికి ప్రత్యక్ష విరుద్ధంగా వ్యవహరిస్తోంది. నెహ్రూ ప్రభుత్వ వర్గము యొక్క పరిపాలనా నిర్వాహణల దుర్బలమైనదనిన్ని, ఆయన ప్రభుత్వవర్గం అవలంబించే వ్యవహార విధానములు అసంబద్ధములుగా ఉంటున్నవనిన్ని డి. పి. మిశ్రాగారు వాదించారు. ఏ వ్యవహార విషయంలో సైనను పండిత నెహ్రూగారు విపరంగా పరిశీలించరనియు, ఆయన చుట్టూ ముఖస్తోత్రాలు చేసేవాళ్ళు చేరి ఉంటారనియు, యింకొ ఏవేవో మిశ్రాగారుఅన్నారు. ఇటువంటి లోపాలు ఉన్నట్లయితే, వాటిని సవరించడానికి, కాంగ్రెసు కార్యవర్గంలోని పెద్దలు నెహ్రూకు సహాయార్థంవెళ్ళి ఆయన సంకల్పములను అమలుపరచడానికి కావలసిన విధములను పరిశీలించి పని జరిపించాలి అంతేగాని, ఆయనయొక్క సంకల్పములను మార్చుకోవలసినదనిగాని, పనులను మరలించుకోవలసినదనిగాని కోరకూడదు.

ప్రజాజీవిత వ్యవహారముల గూర్చిన అనేక విషయములలో రాష్ట్ర ప్రభుత్వములకు తగినంత అధికారం లేకుండా మితిమీరిన అధికారమును కేంద్రప్రభుత్వమునకే భారత రాజ్యాంగ చట్టము కలుగజేయుచున్నదని మిశ్రగారు ఒక నెపం మోపుచున్నారు.

భారత రాజ్యాంగ చట్టమును తయారుచేసినప్పుడు కేంద్ర ప్రభుత్వమును అత్యంత బలిష్ఠముగా చేయవలెనని కాంగ్రెస్ మహాసభ యున్నూ రాష్ట్ర ప్రభుత్వములున్నూ కోరి యుండెను. అప్పట్లో గాంధిమహాత్ముడు అట్టిది అనర్థదాయకమని ఎన్నివిధాలుగా చెప్పినప్పటికీ చెవినిపెట్టలేదు. ఎంతో కష్టంమీద, అధికార వికేంద్రీకరణమునకున్నూ గ్రామోద్ధరణకున్నూ అవకాశములను కల్పించవలెనని ఉపదేశసూచకంగా రాజ్యాంగ చట్టములో, కేంద్రప్రభుత్వానికిమితిమీరిన అధికారములను ఒప్పజెప్పు చుండినపుడు రాష్ట్ర ప్రభుత్వములు యేం చేస్తున్నాయి? అట్టిది కూడదని కించిత్తయినా ఆక్షేపించినవా? టాండన్ వర్గంవారు ఆ రోజులలో ప్రభుత్వభావగా హిందీవుండవలెననే విషయ

[2-వ పేజీ చూడుడు]

## ఆస్ట్రేలియా, న్యూజీలెండు అమెరికాల రక్షణ ఒప్పందం

శాన్‌ఫ్రాన్సిస్కో, సెప్టెంబరు 1: అమెరికా, ఆస్ట్రేలియా, న్యూజిలాండుల ప్రతినిధులు ఒక రక్షణ ఒడంబడికమీద నేడు సంతకాలు చేస్తున్నారు.

పసిఫిక్ రంగంలో అమెరికన్ రక్షణ స్కీమునుంచాలాలను పెంచడానికి ఇది ఒక తార్కాణంగా పేర్కొనబడుతున్నది.

నిన్న అమెరికాతో ఫిలిప్పైన్ దీవులవారు ఇట్టి ఒప్పందాన్నే ఒకదాన్ని చేసుకున్నారు. ఈ ఒప్పందాన్ని అనుసరించి, ఇందులో ఒక రాజ్యానికి ఆపద వస్తే, తక్కిన రాజ్యాలు ఆ రాజ్యానికి తోడుగా నిలుస్తాయి. ఇది పరస్పరం జరిగే సహాయము.

అదీకాక ఈ ఒడంబడిక ప్రకారం ఈ మూడు రాజ్యాల విదేశాంగ మంత్రులతో ఒక సంఘం ఏర్పాటవుతుంది. వారు ఈ సంధి అమలును గూర్చిన వ్యవహారాన్నంతా పరిశీలిస్తూ వుంటారు.

### జపాన్ శాంతి సంధి సమావేశం

#### డీన్ ఎచిసన్ వ్యాఖ్య

వాషింగ్టన్, ఆగస్టు 31: శాన్‌ఫ్రాన్సిస్కోలో జరిగే జపాన్ శాంతిసంధి సమావేశంలో పాల్గొనడానికై అమెరికా విదేశాంగమంత్రి డీన్ ఎచిసన్ నేడిక్కడి నుండి బయలు దేరారు. బయలుదేరడానికి ముందు ఆయన ఇలా ప్రకటించారు:—“ఏదేశాలు వాస్తవంగా శాంతిని కోరుతున్నవో, ఏ దేశాలు కోరడంలేదో ఆ సమావేశంలో బయటపడుతుంది. వివిధ దేశాల శాంతి కాంక్షకు అది పరీక్షా సమయం. ఆ సమావేశంలో పాల్గొనే దేశాలలో అధిక సంఖ్యాకమైనవి శాంతిసంధిపై సంతకాలు చేస్తాయని నా విశ్వాసం.”

#### పాకిస్తాన్ విదేశాంగ మంత్రి

లండన్, ఆగస్టు 31: జపాన్ శాంతి సంధి సమావేశంలో పాల్గొనడానికై పాకిస్తాన్ విదేశాంగ మంత్రి సర్ మహమ్మదు జఫ్రుల్లాఖాన్ ఈరాత్రి విమానంలో ఇక్కడినుండి శాన్‌ఫ్రాన్సిస్కోకు బయలు దేరారు. ఇండియా పాకిస్తాన్‌ల మధ్య ఏర్పడిన తీవ్రతపై ఆయన ఇలా వ్యాఖ్యానించారు:

“ఈ ఉభయదేశాల మధ్య సంబంధాలు ప్రస్తుతం చాల తీవ్రంగా ఉన్నవి. ఇవి విషమపరిణామాలకు దారితీయవచ్చు. పాకిస్తాన్ సరిహద్దులకు సమీపంగా భారత సైన్యాలు సమీకరింపబడి ఉన్నవి. అందు వల్ల పాకిస్తాన్ సాయుధబలాలు కూడా తగిన చర్యలు జరపవలసి వచ్చినది.”

ఆంధ్రరాష్ట్రీయ బ్రాహ్మణ సంఘపర్యసభ్య సమావేశం ౧౦-11 వ తేదిన విజయవాడ మారుతీ సినిమా హాలులో జరుగుతుంది.

## ధాన్యసేకరణ తృప్తిగ లేదని మంత్రి ప్రకటన

### రాష్ట్ర శాసనసభలో చర్చ: సభ్యుల తీవ్ర విమర్శలు

మద్రాసు, సెప్టెంబరు 1: “మనం చాలా క్లిష్టపరిస్థితులను ఎదుర్కోవలసి ఉన్నది. సాధారణంగా జూలై, ఆగస్టు, సెప్టెంబరు మాసాలు కొన్నేండ్లనుంచీ, గడ్డురోజులుగానే ఉంటున్నవి. మనకు పైనుంచి వచ్చే సప్లయిలనుబట్టి మన బాధ తగ్గుతుంది. అమెరికానుంచి వచ్చే బహుమతులు మనదేశంలో వచ్చే సహాయంవల్ల మనకష్టాలు గట్టెక్కగలవనుకుంటాను,” అని మద్రాసుప్రభుత్వ ఆహారశాఖామంత్రి రోష్ విక్టోరియా ఆహార పరిస్థితినిగూర్చి నేడు అసెంబ్లీలో ప్రకటన చేయుచు తెలిపారు.

ఎం. జి. నటేశ చెట్టియారుగారు ధాన్యం బియ్యం, నూకలు, పిండి, రేషనింగు కంట్రోళ్ళు రద్దు చెయ్యాలనీ, విదేశాలనుంచివచ్చే బియ్యానికిమటుకు రేషనింగ్ పెట్టాలని సవరణ తెచ్చారు. విపరీతమైన ధరలిచ్చి విదేశాలనుంచి ధాన్యాలు దిగుమతి చేసుకున్నంతకాలం సస్యాభివృద్ధి కార్యక్రమం ఎన్నటికీ జయప్రదం కాదనీ దేశంలో ఇతర ధరలన్నీ ఆకాశాన్నంటుతున్న పుడుఉత్పత్తిదారులకు తక్కువ ధర ఇచ్చి, ప్రజకు తిండిలేనంతవరకు ఏవిధమైన ప్రయోజనం లేదని ఈసభవారు అభిప్రాయపడుచున్నారనే సవరణను అమ్మాపేట వెంకట్రామయ్యరు గారు ప్రతిపాదించారు.

మాసూలుగా ఇంగ్లీషులో మాట్లాడే తమిళ సభ్యులు అరవంలో మాటలాడటం ఇవాళటి కొత్త విశేషం. పి.నటేశన్ గారు (తమిళంలో) ఇల్లా చెప్పారు. ప్రభుత్వంవారు ఇన్ని పేజీల పుస్తకాల నిండా ఆహార పరిస్థితి ఇల్లా ఉన్నదని వ్రాసిలాభం లేదు. రెండులక్షలటన్నులే ధాన్యం ఉంది. రెండు టొన్నులే ఇస్తామంటే పేదవాడి కడుపునిండదు. దక్షిణార్కాడులో 300 చవుక ధర దుకాణాలు ఉంటే ఎవడిక్కావాలి. 30 ఉంటే ఎవడిక్కావాలి. ప్రజలు బియ్యం తినడానికి అలవాటుపడ్డారు. గోధుమతిను గోధుమతిను అంటారు. గోధుమతింటే విరోచనాలు రోగం వస్తే ఆస్పత్రిలో చోటులేదు పొమ్మంటారు. మంత్రులుమటుకు కడుపునిండా ఎల్లాగో అల్లా తింటారు.

ముఖ్యమంత్రి కుమారస్వామిరాజా: నేను బియ్యపు అన్నం తినడంలేదు.

నటేశన్:— కుమార స్వామిరాజా ధర్మరాజా. సాహూ బియ్యం అక్కరలేదు. అంతా మీలాంటి ధర్మరాజులు ఉండరు. ప్రజకు అన్నం పెట్టలేని ప్రభుత్వం ఉంటేనేమి? పోతే నేమి? ఏ కాంగ్రెసు ప్రభుత్వం రాజ్యం చేస్తున్నా పేదవాడికి మోక్షంలేదు. పేదవాళ్ల కష్టాలు గమనించేవారులేరు. పేదలకు అన్నం పెట్టలేనంతకాలం ఈ సభలోచేసే చర్చలన్నీ నిరర్థకాలు. ఇచ్చే ఉపన్యాసాలన్నీ డొకడంపు ఉపన్యాసాలు. ఈ ఆహారమంత్రి ఢిల్లీ పోతే మొహం చూసేవారుగూడా ఉండరు. పేదలకు కావలసిన బియ్యం ఇవ్వలేక మద్యనిషేధం ఇస్తే ప్రజ సంతోషించరు.”

ఎం. డి. నటేశ చెట్టియారు (తమిళంలో):—ప్రజలకుకావలసినతిండి గింజలు ఇవ్వలేని ప్రభుత్వం కంట్రోళ్లు రేషనింగు రద్దుచెయ్యాలి. కేంద్ర ప్రభుత్వంనుండి తగినంతధాన్యం పరిబాయి సంతరాలేకపోయిన మద్రాసుప్రభుత్వం వల్ల సామాన్యజనానికి ఉపకారం ఎంతమాత్రమూ లేదు.

శ్రీమతి అమ్మన్నరాజాగారు ఇచ్చట అధ్యక్ష స్థానంలో కూర్చున్నారు.

శేఖ్ అమీరుద్దీన్ గారు (ఇంగ్లీషులో):— దేశంలో నాల్గేళ్లు ఉన్న అన్నవస్త్రాల కరువుచూస్తే కాంగ్రెసు ప్రభుత్వ పాలన దుఃఖకరమైనదిగా ఉన్నదనే వేరే వ్యాఖ్యానం చెయ్యనవసరంలేదు. ఆహారమంత్రి ఒకసారి మాట్లాడుతూ “నేను సుఖవంతుణ్ణి. రాష్ట్రంలో ఎక్కడకుపోయినా ప్రజలు సుఖవంతులుగా, ఆనందంతో కనిపిస్తున్నారు” అని చెప్పారు. ఆహారమంత్రి భాగ్యవంతులైనందున విలాసజీవితంలో దరిద్రులైన సామాన్యప్రజల కష్టాలను కనలేకున్నారు.

రాఘవయ్యగారు: మంత్రిగారు ధనవంతులైనందున ప్రజలకష్టాలు కనలేకున్నారు. అనటం మర్యాదా? మీ రూలింగ్ ఇవ్వాలి.

శ్రీమతి అమ్మన్నరాజా: అది అవిడ అభిప్రాయం. ఈ విషయమై రూలింగ్‌తో పనిలేదు.

వాసుదేవు జగ్గరాజుగారు (తెనుగులో): “కాంగ్రెస్ ప్రభుత్వం వచ్చాక ప్రజల స్థితిమీ బాగుపడలేదు. ధాన్యం పంపకాన్నిగూర్చి ఎన్ని సూచనలుచేసినా వినేవాళ్లు లేరు. రామ పాదసాగరం మున్నగు పెద్ద ప్రాజక్టులు రావడానికి చాలా ఏళ్లు పడుతుంది. మురుగు నీటివసతి ఏర్పాటుచేస్తే పంట ఎంతో దక్కుతుంది. ఇంతవరకూ శోనసీమలో పి. డబ్ల్యు. డి. వారు తమ విధిని నిర్లక్ష్యం చేశారు. మురుగునీటి సౌకర్యాలు లేనందున 30 వేల ఎకరాల్లో వున్న వర్షాలవల్ల పంటలు పోయినాయి. ప్రకాశంగారు పెట్టిన సహకార సంఘాలు ఉంచినట్లయితే పంపకం బాధలు ఉండేవిగావు. ఉన్న సంఘాలనైనా ప్రభుత్వం సక్రమంగా వినియోగించుకోవడం మంచిది. మిల్లుల ధాన్యసేకరణ లైసెన్సులు రద్దుచేసి సహకార సంఘాలద్వారా పంపకం చెయ్యడం శ్రేయస్కరం! పేద రైతులను ఈ సేకరణ ఉద్యోగులు పీడిస్తారుగాని భాగ్యవంతులను వదిలేస్తారు. ప్రభుత్వం భాగ్యవంతులకు సహాయం చెయ్యాలనే తత్వాన్ని వదిలి జనసామాన్యానికి లాభకరంగా ఉండే పద్ధతి అవలంబించాలి.

హంటర్ (ఇంగ్లీషులో): ఈ సభలో జరిగిన తెనుగు, అరవ ఉపన్యాసాలు నాకు అర్థంగాలేదు. విజయవాడ ప్రాంతాల కార్మికులకు తగిన రేషన్లు అందలేదని ఆక్షేపణలు వచ్చినవి. రాష్ట్రమంతా ఇల్లాగే బాధలు ఉండి ఉండవచ్చు. మద్రాసు రాష్ట్రంలో ప్రజల అవస్థలుపోవాలంటే మద్రాసు ప్రభుత్వ అవసరాలను గూర్చి కేంద్ర ప్రభుత్వానికి గట్టిగా ప్రజావసరాలను గూర్చి నచ్చచెప్పాలి.”

అయ్యదేవర కాళేశ్వరరావుగారు (ఇంగ్లీషులో): “అన్నంలేని వాళ్లను,

(2-వ పేజీ చూడుడు)

## కొరియాలో సమితిబలాల కొత్తదాడి ప్రారంభం

టోకియో, సెప్టెంబరు 1: సమితి బలాలు ఈ నాడు తూర్పు కొరియా తూర్పు కేంద్రరంగాలలో అంతటా ముందుకు చొరుచుకుని పోతున్నవి. సమితి బలాలు చాల పర్వతాలను ఆక్రమించుకున్నవి. సమితి బలాల దాడిని కమ్యూనిస్టు సైన్యాలు తీవ్రంగా ప్రతిఘటిస్తున్నవి. కొన్ని ప్రదేశాలలో సమితి బలాల పురోగమనం నిలిచి పోయినదని కూడా తెలుస్తున్నది.

కొసాంగుకు సమీపంగా ఉన్న కమ్యూనిస్టు సైనిక స్థావరాలపై సమితి యుద్ధ విమానాలు బ్రహ్మాండమైన దాడి జరిపినవి. యుద్ధనౌకలు కూడా నిర్విరామంగా శతఘ్ని కాల్పులు కొనసాగిస్తున్న వని రిడ్జివే కేంద్ర కార్యాలయం ప్రకటించినది.

ఒక అమెరికన్ విమానం కేసాంగులోని జనరల్ నామ్ఇల్ గృహం పై రెండుబాంబులు వేసినట్లు నవచైనా వార్తా సంస్థ తెలియ పరిచినది. ఆ సంఘటన పరిశోధించడానికి ప్రతినిధులను పంపమని కమ్యూనిస్టు ప్రతినిధి వర్గం వారు సమితి అధికారులను కోరారు. కేసాంగు తటస్థ ప్రాంతంలో 11 దక్షిణ కొరియన్ సైనికులు ముగ్గురు కమ్యూనిస్టు సైనికులపై బడి వారిలో ఇరువురిని హతమార్చినట్లు పెకింగు రేడియో ప్రకటించినది.

కమ్యూనిస్టు సైన్యాలపై సమితి యుద్ధ విమానాలు, పదాతి బలాలు పెద్ద ఎత్తున కొత్త దాడి ప్రారంభించినట్లు అష్టమ సైన్య ప్రతినిధి ఒకరు నిన్న ప్రకటించారు.

కేసాంగు ప్రాంతపు తాటస్థ్యాన్ని భిన్నపరుస్తు సమితిబలాలు జరిపిన చర్యలను అధిక్షేపిస్తు జనరల్ నామ్ ఇల్ నిన్న ఒక సందేశం పంపారు. కేసాంగుపై నేపామ్ పడవేసిన విమానంలోని సైనికోద్యోగులను కఠినంగా శిక్షించాలని ఆయన కోరారు.

### దొంగ ధాన్యం

మసులీపట్నం, ఆగస్టు 31: దొంగతనంగా పాతిరవేసిన 2 వేల మణుగుల ఆహార ధాన్యాలు రామవరన్‌లో ఒక ధాన్యపు వ్యాపారస్థుని గిడ్డంగిలో పట్టుబడ్డాయి.

## కృష్ణానది నీటి పంపకంలో ప్రాంతీయవాంఛలకు తావులేదట

### పెన్నార్ ప్రాజెక్టు నిర్మాణావశ్యకతపై ప్లానింగ్ కమిషన్‌కు పార్లమెంటు సభ్యుల విజ్ఞప్తి

న్యూఢిల్లీ, ఆగస్టు 31: దక్షిణ భారతదేశంలో ప్రశస్తమైన నీటి పారుదల సౌకర్యాల ప్రాజెక్టు కృష్ణా-పెన్నారు ప్రాజెక్టును శాంక్షను చేయవలసిందిగా 10 మంది మద్రాసు శాసనసభా సభ్యులు, పదిమంది పార్లమెంటు సభ్యులు (మద్రాసు తాలూకు వారు) నేడు సమిష్టిగా ఒక నివేదికను ప్లానింగ కమిషన్ వారికి సమర్పించారు.

ఈ మెమొరాండంమీద సంతకం చేసినవారిలో శ్రీ రామనాథగోయింకా మినహా తక్కినవారంతా తమిళులు. ఈ ప్రాజెక్టును తమ ప్రణాళిక రెండో భాగంలో చేర్చవలసిందిగా వీరు కమిషన్ వారిని ఈ మెమొరాండంలో అర్థించారు. ఈ ప్రాజెక్టు గనుక నిర్మించినట్లే ఆహారాదిక విషయాలలో మద్రాసు రాష్ట్రం స్వయంసమృద్ధం కాగలదని వీరు ఈ మెమొరాండంలో కమిషన్ వారికి తెలియజెప్పారు.

ఈ ప్రాజెక్టు పూర్తిగా నిర్మింపబడేటప్పటికి 15 ఏండ్లు పడుతుంది. 2 మిలియన్ల టన్నులు పండే నేల సాగులోకి వస్తుంది.

యీ ప్రాజెక్టు నిర్మాణం తగదని, అందు వల్ల తెలుగు వారికి అపారనష్టం వాటిల్లుతున్నదని బయలు దేరిన ప్రచారానికి ఈ మెమొరాండంలో వీరు ఈ విధంగా సమాధానం ఇస్తున్నారు. అసలు ఈ నదులనీరు చాలా భాగం కృష్ణా గోదావరి డెల్టాలో వినియోగానికి వచ్చేస్తూనే వున్నది. అక్కడ వినియోగంలోకి రాగా మిగిలిన నీరు, ఆ నీటిని ఉపయోగించుకునే అధికారం లేని ప్రాంతాలలో వినియోగించుకో బడుతున్నది. వీటిని అట్లా వదిలేసినా, తెలుగు దేశం మద్రాసు రాష్ట్రంలో ఒక భాగంగా వుంది. అందు ఆ రాష్ట్రంలో అందరికీ ఆ నీటిమీద సమానమైన హక్కులు వున్నాయి. మద్రాసు ఏక పరిపాలనా ప్రాంతం కాబట్టి, ఆ రాష్ట్రంలో పారే నదీజలాల విషయంలో ఇది తెలుగు ప్రాంతం అని, ఇది అరవ ప్రాంతం అని విచారణ పనికిరాదు. అట్లావస్తే మా మెట్టూరునుంచి విద్యుచ్ఛక్తిని తెలుగుజిల్లాఅయిన చిత్తూరుకు ఇస్తున్నాము. అందు మద్రాసు వంటి సంశ్లిష్ట రాష్ట్రంలో ఇట్టి పంపిణీలు సమంగా జరగా లని తెలుసుకుంటే, తెలుగువారి ప్రచారంలో వున్న అంతరార్థం తెలుగు వాళ్లందరికి తెలిసివస్తుంది.

### ‘నవ చైనాను పరిగణించాలి’

—(౦)—

#### అమెరికా సుప్రీమ్‌కోర్టు న్యాయమూర్తి హితవు

శాన్‌ఫ్రాన్సిస్కో, ఆగస్టు 31: ఆసియాలో ఇటీవల పర్యటన చేసివచ్చిన అమెరికా సుప్రీం కోర్టు న్యాయమూర్తి. విలియమ్ డగ్లస్ ఈవేళ ఇక్కడ పత్రికా విలేఖరులతో ప్రసంగిస్తూ, “అమెరికా ప్రభుత్వం కమ్యూనిస్టు చైనాను గుర్తించి, ప్రపంచ మంతటా ప్రజాస్వామ్యాన్ని బలపరచేందుకు ప్రస్తుతం రష్యా చైనాలకు కలుగుతున్న తగవులను సాధనోపాయంగా వినియోగించుకోవాలని హెచ్చరిక చేశారు.

“అమెరికా గనుక కమ్యూనిస్టు చైనాతో రాజీ కుదుర్చుకో గల్గినట్లయితే, ఆసియా రాజ్యాలు రష్యాపట్ల సానుభూతి చూపడం మాని, పూర్తిగా పాశ్చాత్య దేశాల వైపుకు తిరిగి పోతాయి అనడంలో అనుమానంలేదు. కమ్యూనిస్టు చైనాతో రాజీ కుదుర్చుకో డానికి తోడు అమెరికా ఆసియా రాజ్యాలపట్ల ఉదారమైన విధానాన్ని అనుసరించడం కూడా అవసరం,” అన్నారు.

### ఎన్నికల కమిషనరుకు మహిళల విజ్ఞప్తి

న్యూఢిల్లీ, ఆగస్టు 31: స్త్రీలసంఘాల తరపున ఒక ప్రతినిధివర్గం నిన్న చీఫ్ ఎన్నికల కమిషనర్ శ్రీ సుకుమారసేన్‌ను కలుసుకొని, ఓటర్లను చేర్చడంలో వచ్చిన పొరపాట్లవల్ల వివిధ రాష్ట్రాలలోను 28 లక్షలమంది స్త్రీలకు ఓటు అనేది లేకుండా చేయబడుతున్నందుకు తమ ఆక్షేపణను తెలియజేశారు.

వారిపేర్లను ఓటర్లజాబితాలలోంచి కొట్టివేయడం అన్యాయమని, తిరిగి చేర్చుకోడానికి 50 రూపాయలు డిపాజిట్ చెల్లించుకోమనడం అక్రమం అని వీరు ఆయనకు నివేదించుకున్నారు.

